ర

౦చు, దా

ఎవి

మ విగ్రహీగేడిక

ుగంబున బ్రొద్దు వాడిచినటు

ఎళంబంతి దనతాతదే యటంచు

రాయి గడిగితివన్న గర్వంబుచేత

నార్యులను దిట్టిపోయు వన్యాయముగను

రాయి కడిగినమాత్రాన "కోయగాడు"

బ్రహ్మదేవుడే? విగ్రహారాధకులను

దప్పుగాదిట్టి మతిదాని తత్వమెఱుగు

మానవులకేను భక్తనమస్కరింతు

——

## వరప్రసాదము



న పది,

౦ప్రదాయ

ష, లలితమైన

న్నియు నీకావ్యమం

నడుమంత్ర

కవి-శిరోమణి సన్ని

సూర్యనారాయణశాస్త్రి

పుటలు ౩౭

వెల రూ ౦-౪-౦

దొరకుస్థలము వేంకట్రామఅండ్ కో, ౩౯౯౩ మార్కెటువీథి, సికింద్రాబాదు-దక్కను

ఒక బీదబ్రాహ్మణుని పుత్రుడు ఏదోయొక రీతి వృద్ధికివచ్చినతర్వాత గర్వించి తనయధీన మందుండినవారిని కష్టపెట్టుట, తత్ఫలితముగా వారువ్యతిరేకించి యాబ్రాహ్మణపుత్రుని పద భ్రష్టుని గావించుట-ఇది ఐందలియితి వృత్తము కవిగారు పీఠికలో నీకథనుగురించి యిట్లు వ్రాసినారు

"లోకవృత్తమును వర్ణించుటయే నాయుద్దేశముకాని యొకవ్యక్తి చరిత్రముకాదు. యాదృచ్ఛికముగా నిందలి విషయములే వ్యక్తికేని సంబంధించిన సంబంధింపవచ్చును" అందుచేత "గుమ్మడికాయ దొంగవలె బుజాలుచూచుకొనకుడు" అని హెచ్చరికచేసినారు. ఏవ్యక్తినిగురించివ్రాయని వారికింత యుపోద్ఘాతమెందుకు, ఇంతటి బుజాలు పట్టిచూచుకొనుట, పట్టిచూచుటయెందులకు ప్రతికథకుడును, నిక్షేపవచ్చును. లోకములో ప్రతివాడును తన్నుగూర్చియే సూచనయున్నదని కథలోనియేవాక్యమునోపట్టుకొని వాదింపవచ్చును ఈగ్రంథమందలి శైలివిషయములో మాకంతగా విమర్శనీయముకానరాదు కాని కథమాత్రము చమత్కారయుక్తముగా లేదని చెప్పవలసి యున్నది

### గోవు

కవి బొడ్డుబాపిరాజుగారు

పుటలు ౪౩

వెల. ఏలూరు గోసంరక్షణసమితి దాతలకు ఉచితము.

దొరకుచోటు గోసంరక్షణ సమితి కార్యాలయము, ఏలూరు

కవిగారు మంచి తేటపద్యములతో గోమాతా ప్రశంస గావించియున్నారు ఈవిషయము ననుసరించి వ్రాసినకవితలో ౯ది మిన్నగానున్నది.

——

## పరిశ్రమ

సవాయి

తులు హెచ్చుగ

మ" బెల్లమునకు

పంచదారయొ

యుండగల శక్తి

థా గానష్టమగు

ములోనికి తీసు

ల్లమునుండి రిఫై

బు మెషనులో

(Molasses)

జాతుపదార్థము

ఎతో నూటికి ౩౦

గిలిపోయినప్పటికి

క ఈ మొలేసను

ధనములు కనపడు

నష్టమగుచున్నది క్రీము

ులేసను రాకపోవుటచే రైతు

ునకు పాల్పడనక్కరలేదు.

రైతులకు ప్రోత్సాహవచనము

దేశీయపరిశ్రమ ఫ్యాక్టరీ పరిశ్రమతోపాటు చిరకాలము ప్రాముఖ్యతవడవి దేశములోని అనేకమం[illegible]లకు ము[illegible]జీవనోపాధిగా నుండగలదు ఇం[illegible] శ్రద్ధతీసుకొని కృషిచేయవలయును వారిశ్రమయంతయు ఎన్నటికిని వృథాకానేరదు. శాస్త్రజ్ఞులుకూడ క్రమక్రమముగా వారిమేలుకై పాటుపడెదరు

——

### గోప్రభావము

కవి ముదిగొండ నాగలింగశాస్త్రిగారు

పుటలు ౩౪

వెల సమితిదాతలకు ఉచితము

దొరకుచోటు "గోసంరక్షణసమితి కార్యాలయము, ఏలూరు

ఇదియు ఏలూరు గోరక్షణసమితివారిచే పైబాపిరాజుగారి గ్రంథములతోపాటు ప్రచురింపబడినది. ఈశాస్త్రిగారికవితము పైవారి కవితకు తీసిపోదు

మనదేశములో ఎన్ని ముప్పతిప్పలను గోసమస్య అట్లేయున్నది. విదేశాలపాలడబ్బాలు చౌకగా దొరుకుంగా మాతాదేశములో బీదలకు పాలరుచి తెలియదు

——

### ప్రణయవాహిని

కవి అంబటిపూడి వెంకటరత్నంగారు

పుటలు ౩౮

వెల ఉచితము

దొరకుచోటు "అంబటిపూడివెంకటరత్నంగారు చందూరు, నల్లగొండజిల్లా"

ఇది చిన్న పద్యకావ్యము. ౧౮౫ పద్యములుకల్గి. చిన్నప్రణయగాథ బాలవితంతువును నొకకవి ప్రేమించుట యిందలి యితివృత్తము. కవి మంచిపాండిత్యముకలవాడని శైలివలన నెరుగవచ్చును కవితాధార అనర్గళము. మంచిభావ విస్ఫూర్తియు ఆనందదాయకమునగుకవిత.

# గోలకొండ పత్రిక

ధాత నామ సం॥ ఆషాఢ బ॥ ౭

సోమవారము


## గ్రామాలలో టప్పా సౌకర్యములవ్యాప్తికై మన ప్రభుత్వయత్నములు

మనరాష్ట్రము ఇతర నాగరకరాష్ట్రములతో సమానస్థానము పొందుటకు మనరాష్ట్రమందు గ్రామసీమలలో టప్పా సౌకర్యములు ఎక్కువచేయుట అవసరమని మేము ఇదివరకు అనేకపర్యాయములు సూచించియున్నాము గ్రామసీమలలో టప్పాసౌకర్యముల వ్యాప్తి రేడియో, విమానసౌకర్యములవ్యాప్తికంటె గూడ ఎక్కువ ముఖ్యమైనదనియు చెప్పియుంటిమి కాబట్టి రేడియో, విమానసౌకర్యములు మున్నగు నాగరిక ప్రపంచలక్షణములను మనరాష్ట్రమున ప్రవేశపెట్టువిషయమున బ్రిటిషిండియాలోని ప్రభుత్వముతో సమానముగ పని చేయుచున్న మన ప్రభుత్వమునకు బ్రిటిషిండియా ప్రభుత్వపు టప్పాశాఖవారు వారి రాజ్యములో గ్రామసీమలయందు టప్పాసౌకర్యములను ఎక్కువచేయుటకై యత్నించ ప్రారంభించిన ఈసమయములో మనరాష్ట్రమందును గ్రామసీమలందు టప్పాసౌకర్యముల వ్యాప్తికై యత్నించుట చాల అనుగుణముగా నుండునని తలచియుంటిమి తలచునప్పుడు మన ప్రభుత్వమువారు ఈవిషయమై శ్రద్ధవహించియేయుందురనియు ఆశించియుంటిమి. అనుకొనినట్లె, మన ప్రభుత్వమువారు బ్రిటిషిండియాప్రభుత్వపుటప్పాశాఖవారు వారిప్రాంతములో గ్రామ సౌకర్యార్థమై ఏట్టిఏర్పాట్లను గావించుచున్నారో అట్టి ఏర్పాట్లనే మనరాష్ట్రమునందునుగావించుటకు తగినయత్నములను చేయుచున్నట్లు ప్రకటన శాఖాధికారిగారివలన వినుటచే సంతోషించుచున్నాము బ్రిటిషిండియాలో చేయబడుచున్న ఏర్పాట్లను ఇదివరకే ౨౭ మే ౧౯౩౬ నాటి సంచికలోనే సంపాదకీయవ్యాసమున అసోసియేటెడుప్రెస్సువార్త దెలిపినంతవరకు తెలియబరచియున్నాము.

మేమావ్యాసములో ౧౩౪౨ ఫసలీ వరకుటప్పాకార్యాలయములవ్యాప్తి నిచెప్పగలిగితిమి తర్వాత ౧౩౪౪ ఫసలీ అంతమువరకు జరిగిన అభివృద్ధిని సూచించుఅంకెలను ప్రకటనశాఖాధికారిగారు తమలేఖలోదెలిపి, ౧౩౪౫ ఫ. అంకెలు ఇంతకంటె వృద్ధిని సూచించుచున్నట్లు వ్రాసినారు వారు ఇంకనుమూడునెలలుమిగిలియున్న ౧౩౪౫ ఫ అంకెలను తమకులభించినంతవరకు త్రమకేఆక్షేపణ లేనిచో, తెలియబరచిన ఇంకను ఉత్సాహాకరము గ నుండెడిది

పైన బేర్కొనిన మాపూర్వ సంపాదకీయవ్యాసమందు మేము సూచించినట్లు టప్పాసౌకర్యముల సంపూర్ణాభివృద్ధి సంపూర్ణముగా ఒక్క టప్పాశాఖవారి యత్నాలవల్లనే జరుగదు రాష్ట్రములో విద్యావ్యాప్తియు, వాణిజ్యవ్యాప్తియు, నిరుద్యోగములేని సుఖపరిస్థితులునుగూడ ఈ టప్పాసౌకర్యముల అభివృద్ధిని నిర్ణయించుచుండును అను సంగతినిగూడ జ్ఞప్తిలోనుంచుకొనవలెను

మొత్తముమీద మనప్రభుత్వము వారు గ్రామజనుల విషయమున ఉపేక్ష వహించియుండలేదనుటకు గల అనేకనిదర్శనములలో నిపుడు చర్చించినదియు, నొకటైనందుకు మరియొకసారి మాసంతోషమును ప్రకటించుచున్నాము వివిధప్రభుత్వశాఖల విడివిడి ప్రయత్నములను ప్రజలఅభివృద్ధికై ఏకతోముఖముగ బద్ధముచేయుటయందు కేంద్రప్రభుత్వము శ్రద్ధవహించుటవలన, విడివిడిగా ఆయా ప్రభుత్వశాఖలు సంపూర్ణముగ పరిష్కరించజాలని, లేక పరిష్కరించుటకు ఎన్నోఏండ్లకాలమును ఆక్రమించునోనునట్టి సమస్యలు శీఘ్రకాలములో నిశ్శేషముగా పరిష్కారము జెందును

---

పురపాలకసంఘసభలో

మోతీమహాల్ చర్చ

హైద్రాబాదు ౨౫-అమర్దాదు

అబ్దుల్వాహదుసా॥ ఆవేషిగారి అధ్యక్షతన ౮-౩౦ గంటలకు పురపాలక సంఘ సభసమావేశమై అందు మోతీమహాలుదురంతసమస్య చర్చింప బడినది

"విచారణ సంఘములో పాల్గొన్నందున నివేదిక పంపజాలకుంటిని, ఇపుడు త్వరలో పంపెదరు అని యున్నపురపాలక నాజంగారివి మూరాసిలాచదువబడెను ఆపై గతసమావేశపు నివేదిక వినిపింపబడెన

శ్రీరామకృష్ణారావుగారు మాట్లాడుచు మోతిమహాలు దురంత విచారణకై ఓ(సబ్ కమిటి) ఉపసంఘము నేర్పాటుచేయుటకు నాజంగారు కోరిరి ? ఇక ఉపసంఘపు ఉద్దేశ్యము లేవన, పురపాలక సంఘమువకు సంబంధించినంతవరకు, ఫైరు బ్రిగేడు ఎంతవరకు తనవిధ్యుక్త ధర్మము నెరవేర్చినది అవసర వస్తువులచట యున్నవా ఈ విషయములన్నియు సంఘము ముందు మాట్లాడవచ్చును

విచారణ సంఘమునకుపోటీరాకుండ నీయుల ఈ ఉపసంఘమునకు నియమములు ఏర్పాటుచేయవలెను" నాజంగారుఈ సభ నేతిమయభి ప్రాయము నిచ్చిన మేము నిర్ణయమునకు రాగలము అని చెప్పిరి

నాజంగారు ప్రత్యుత్తరమిచ్చుచు విచారణ సంఘము ఫైరు బ్రిగేడు విషయము విచారించుచున్నది ఉప సంఘము కార్యనిర్ణయముచేసిన వేనేపురపాలక నాజముగా విచారణ సల్పెదను వారమురోజులగడువిచ్చిన విచారణసల్పినివేదిక సిద్ధపరతునని

అబుల్హసనుసా॥ మాట్లాడుచు, ఫైరుబ్రిగేడు వారు సహాయపడిరా? లేకున్న వారికి తగుశిక్ష కావలసియున్నదని

తుదకు నివేదిక సిద్ధపరచుటకు ౧౦ రోజుల గడవు నాజము గారికివ్వబడెను.

---

# మరొక సినీమా అగ్నిప్రమాదము

## ముగ్గురు ఆపరేటర్లు కాలుట

మైసూరు సంస్థానములో తుంకూరుజిల్లాలోని టిప్టూరులో ఒకసినీమాభవనములో అగ్ని ప్రమాదముపుట్టి, ముగ్గురుఆపరేటర్లుకాలి, ఇరువురుమగణించిరని మైసూరుపోలీసు ఇన్స్పెక్టరు జనరలు మైసూరుప్రభుత్వమునకు రిపోర్టుచేసినట్లు ప్రభుత్వమువారి ప్రచురణశాఖాధికారి ప్రకటించినాడు ఈదురంతము మొన్నటిజూను నెల ౨౩ వతేది నాటిరాత్రవేళ జరిగెను ఆపరేటింగురూములో పనిచేయుచుండిన ముగ్గురు కాలగా అస్పత్రికిచేర్చబడిరి వారిలో నారాయణరావు, శివన్న అనువారలిరువురును అరో జేమరణించిరి కృష్ణాజీఅనువతడు ప్రాణసంశయములో చిక్కియున్నాడు ఈరిపోర్టుపై ప్రభుత్వమువారు తుంకూరుపోలీసు సూపరింటెండెంటు యింకనుపూర్తిగవిచారణజరిపి సంపూర్ణమైన నివేదికను పంపవలసినట్లు ఉత్తరువు చేయబడినది

---

## మోతీమహల్ దురంతము దేశమంతటిని కలవరపరచిన విధము

మద్రాసులో బహిరంగ సభలోసానుభూతి

మోటారు బస్సులను నడుపువారు సమ్మెకట్టిన వారిపట్ల సానుభూతిని జూపుటకై, ఆఫీసులకు వెళ్లు ఉద్యోగులను, గుమస్తాలను, తమ బండ్లలో నెక్కించుకొనకున్నారు గుమస్తాలు సకాలమునకు ఆఫీసుకు వెళ్లనిచో, సమ్మెకట్టిన వారికి సహాయముజేయ గవర్నమెంటు త్వరలో పూనుకొన గలదనీ అబస్సుల డ్రైవర్లు అనుచున్నారు సమ్మెకట్టిన బండ్లవారు, వారిమృగములతోగూడ నిన్నసాయంకాలము ఢిల్లీ నగర వీధులందు ఊరేగుచు వెళ్లిరి వారిఊరేగింపు అర్ధమైలు నిడివుయియుండెను, అట్లు ఊరేగుచు వెళ్లినవారు "రాణితోట" వద్దసభగూడి, మునిసిపాలటీవారి బిరుసుతనమును ఖండించుచు ప్రాధేయపడరాదని సమ్మెకట్టినవారు నిశ్చయించుకొనిరి అధికారులే తమవద్దకు వచ్చినఎడల సమధానము కుదుర్చుటకు తగినసూచనలను గూర్చి యోచించబడుటకును తీర్మానించుకొనబడెను ఢిల్లీ ప్రధానకమిషనరు సిమ్లాలోనుండుటచేత దమ ప్రతినిధులను ఆప్రధాన కమిషనరును దర్శింప ఢిల్లీ చాకర్లు పంపదల పెట్టియున్నారు తర్వాత ఫిల్ములను తయారుచేయుటలో గల కష్టములనుగూర్చి పలువురు ఉపన్యసించిరి

---

రాకపోకలు

---

హైద్రాబాదు, ౨౮ అమర్దాదు —

౧౦-౧౨ రోజులనుండి నగరములోనుండి ౨౮ అమర్దాదునాటి ౫-౫౫ సాయంత్రము బండిలో మౌలానా షౌకతలీగారు బొంబాయిపోయిరి నాంపల్లిస్టేషనుపై నవాబు అసగరుజంగుబహదరు మొదలగువారు వీడ్కొల్పుటకై వచ్చియుండిరి

హైద్రాబాదు, ౨౮ అమర్దాదు —

ఉస్మానియా విశ్వవిద్యాలయ కళాశాల ఇంగ్లీషు ఆచార్యులగు డా॥ అబ్దులతీఫ్ సా॥ బొంబాయివెళ్లిరి

హైద్రాబాదు, ౨౮ అమర్దాదు —

ప్రభుత్వ విద్యాశాఖ అమాత్యులగు నవాబు మెహదియార్జంగు బహదరుగారు ప్రభుత్వకార్యముపై గుల్బర్గాకెళ్లిరి.

---

## నిజాంరాష్ట్ర గ్రామసీమలలోటప్పా సౌకర్యముల వ్యాప్తి

మ ఘ వ నిజాంప్రభుత్వమువారు ప్రయత్నములు చేయుచుండుట

మ ఘ వ నిజాంప్రభుత్వ ప్రకటనశాఖవారు మాక్రిందిలేఖను ప్రకటనార్థమై పంపినారు ఇదిమాపత్రికయొక్క ౧౫ మే ౧౯౩౬ నాటిసంచికలోని సంపాదకీయమునకు సమాధానముగ పంపబడినది

"౧౯౩౬ మే ౨౫ వతేదినాటి మాపత్రికలోవచ్చిన "టప్పాసౌకర్యములు" అనుశీర్షికగల వ్యాసమునుగూర్చి నేను చెప్పగలవిషయమేమనగా మ ఘ వ నిజాం పభుత్వముయొక్క టప్పాశాఖవారు గ్రామసీమలకు టప్పాసౌకర్యములను వ్యాపింపజేయుటకై సాధ్యమైన ప్రయత్నము లన్నింటిని చేయుచున్నారు ఎక్కడజాబులపెట్టెలను ఉంచుట శక్యముగాదో అక్కడగూడ, గ్రామస్థునికి ఈలాభముసాధ్యమైనంత అందుబాటులోనుండవలెనను ఉద్దేశ్యముతో అవిశంచబడినవి

ఈప్రయత్నముల ఫలితముగా, టప్పాకార్యాలయములును, టప్పాపెట్టెలును ౧౩౩౯ వ ఫ. లో ౭౬౩ ను, ౭౨౧ యుఉండినవి ౧౩౪౪ వ ఫ లో వరుసగా ౮౧౮ కిని, ౧౧౬౩ కును హెచ్చినవి ౧౩౪౫ ఫ లో అంకెలు చూచినచో ఇంతకంటె హెచ్చుదల కనిపించును గ్రామములలో టప్పాసౌకర్యములను ఏర్పరచుటకై ఇటీవలనే బ్రిటిషుఇండియాలో చేయబడినటువంటి ఏర్పాటులను - య నుద్దేశించబడియున్నది దానికై క్రములు జరుగుచున్నవి"

---

## ఉస్మానియా విద్యాకళాశాల

తెలుగుశాఖలో రెండవ ఆచార్యుని నియామకము

ఉస్మానియా విద్యాపీఠముయొక్క అడిక మెట్టు కళాశాలలో తెలుగుశాఖలో కొంతకాలము క్రింద నుండిన రెండవ ఆచార్యుడు ఖర్చుతగ్గించుకొను విధానములో తీసివేయబడియుండెనుగదా మరల ఇటీవల రెండవ ఆచార్యుని నియామకమునకై ప్రకటన చేయబడెను, ఇప్పుడు ఆస్థానమునకు మద్రాసు విశ్వవిద్యాపీఠమువారి గత యం ఏ పరీక్షలో కడతేరిన శ్రీయుత ఖండవల్లి లక్ష్మీరంజనముగారు నియోగించబడినట్లు రూఢిగా తెలియుచున్నది లక్ష్మీరంజనంగారు మొదట సిటీకాలేజీలో పనిచేయుచుండిరి తర్వాత అడిగమెట్టులో ఉస్మానియా విద్యాపీఠమునకు భవనముల నిర్మించుచున్న శాఖలోచేరి ఇంతవరకును అక్కడనే పనిచేయుచుండిరి, ఈపదవికై సుమారు ఆరుగురు దరఖాస్తులు పెట్టియుండిరి, వారిలో పూర్వము పనిచెసియుండినవారగు మహమ్మదు ఖాసింఖాసాహెబ్ గారును ఈ పదవికై ప్రయత్నించియుండిరట

---

# కాంగ్రెసు స్థాయిసంఘమునకు ఎన్నుకొనబడిన ఆంధ్రప్రతినిధులు

గుడివాడ; జూన్ ౨౯: —

ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసుసంఘ సమావేశము నిన్నటిదినము గుడివాడలో శ్రీయుత కేతవరపు లక్ష్మీనరసింహారావు బి.ఏ గారియింట జరిగెను. శ్రీయుత తెన్నేటి విశ్వనాథంగారు మినహా కార్యనిర్వాహకవర్గ సభ్యులెల్లరు విచ్చేసియుండిరి.

ప్రకాశం పంతులుగారు సభాధ్యక్షత వహించిరి. ఉదయం ౮-౩౦ గంటలకు కార్యనిర్వాహకవర్గ సమావేశము ప్రారంభమయ్యెను. సాయంకాలము ౭-౩౦ గంటలకు రాష్ట్రీయ సంఘసమావేశము ప్రారంభమై ౮ గంటలవరకు జరిగెను. అనంతరము కార్యనిర్వాహకవర్గము సమావేశమై ౯ గంటలవరకు ముఖ్యాంశములను చర్చించిరి. మరల మహాజనసభ ప్రారంభమై ౧౧ గంటలవరకు తీర్మానముల కొన్నిటిని ఆమోదించిరి. భోజనానంతరము మరల చర్చ ప్రారంభమై రాత్రి ౧ గంటకు సభాకార్యక్రమము సమాప్తి జెందెను.

ప్రప్రథమముగా రాష్ట్రీయ సంఘమునకు లక్నో కాంగ్రెసునందు ఆమోదింపబడిన నూతన నిబంధనల ననుసరించి లభించిన అఖిలభారత కాంగ్రెసు సంఘములోని మూడు స్థానములకు ఎన్నికలు జరిగెను.

శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుగారు

[illegible]లకు ఎవ పోటీచే [illegible]రులలో [illegible]ము కాశీనా[illegible]గేశ్వరరావు [illegible]లు, కళావెంక[illegible]రావు, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారలు విజయమొందిరి. శ్రీమతికమలాదేవి, ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెసు సోషలిస్టుపార్టీ అధ్యక్షులగు శ్రీయుత బి. రంగశాయి పంతులుగారు, ఆచార్యరంగాగారలు ఓడిపోయిరి.

ప్రొఫెసర్ యన్. జి. రంగాగారు

అధ్యక్షుని కోరికపై కార్యనిర్వాహకవర్గ సభ్యత్వమునకు రాజీనామా నొసంగిన శ్రీయుత పట్టాభి సీతారామయ్య పంతులుగారు తమ రాజీనామా నుపసంహరించుకొనిరి.

### కాంగ్రెసుసంస్థలు-జనసామాన్యము

వివిధ కాంగ్రెసు సంస్థలకును జనసామాన్యమునకును సన్నిహిత సంబంధము నొడగూర్చుటకుగల మార్గములగూర్చి జిల్లా కాంగ్రెసు సంఘముల యభిప్రాయముల గమనించి రాష్ట్రీయ సంఘాభిప్రాయమును దెలుపవలసినదిగ అఖిలభారత కాంగ్రెసు సంఘమువారు పంపిన లేఖపై చాలసేపు జరిగెను. అధ్యక్షులు కొన్ని జిల్లాలనుండి రిపోర్టులు వచ్చియుండలేదని దెలిపిరి.

ఈవిషయమునుగూర్చి విచారణ రాబోవు రాష్ట్రీయసంఘ సమావేశమునకు వాయిదా వేయవలెనని తీర్మానించబడెను.

మరియు సభవారు, బ్రిటిషు సామ్రాజ్యతత్వము పెంపొందుచున్న పాలెస్టయిన్ లోని అరబ్బుజాతీయవాదులయెడల సానుభూతిని దెలుపుచును బాల్ఫొరు ప్రకటనను నిరసించుచును, వెంటనే పాలెస్టయినులోనికి యూదులు వలసవచ్చుటను నిలిపివేయవలసినదిగ కోరుచును బ్రిటిషు మాండేటునుండి తప్పించి ఆదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము నొసంగవలసినదిగ గోరుచును తీర్మానింపబడెను.

ఇమ్మట, బ్రిటను దేశము సలుపు ఏయుద్ధమునందుకూడ హిందూదేశము బ్రిటనుకు సాయము చేయరాదను నభిప్రాయములో, జాతిసమితి మానవకోటి శాంతికి బనిజేయజాలదుగాన వెంటనే ఆసమితి రద్దుచేయబడవలెననియు, అందునుండి ఇండియాప్రభుత్వము తనసభ్యత్వము వదలుకొనవలెననియు తీర్మానము గావింపబడెను.

ఇథియోపియనులతో సానుభూతిని దెలుపుచు, ఇటలీయొక్క నిరంకుశత్వమును ఖండించుచును, జాతిసమితిలోని తదితర సామ్రాజ్యతత్వదేశములవారి ద్రోహమును గర్హించుచును సభవారు తమయభిప్రాయమును వ్యక్తీకరించిరి.

ఆంధ్రరాష్ట్రమునందు కాంగ్రెసు కార్యక్రమమును వివిధ మార్గముల నడుపుటకు అచ్చటచ్చట బ్యూరోలను స్థాపింపవలెనను తీర్మానము కార్యనిర్వాహక సంఘమువారికి రిఫరు చేయబడెను.

రాష్ట్రీయ కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘసమావేశము మరల జూలై ౧౧వ తేదీన బెజవాడలో జరుగును.

## బహుమాన ప్రదానము

3 వ జూలై ౩౬ సం॥ శుక్రవారం సాయంకాలము ౬-౪ గం॥ నుండి రెడ్డిహాస్టలు హాలులో ధ్రువ విజయమను నాటకమును నారాయణగూడెం బాలికా సమాజమువారు శ్రీ రాజా బహద్దరు వెంకట రామారెడ్డిగారి యాధిపత్యమున ప్రదర్శించిరి. బాలికల నేర్పునకు సంతసించి శ్రీరాజా బహద్దరుగారు ఏడుగురు బాలికలకు వెండికప్పుల బహుమానములిచ్చిరి. ఈనాటకము సుల్తాన్‌బజారు హిందూ ప్రజోపకరిణీ సమాజమువారి పక్షమున నేర్పాటు చేయబడెను. వారి యాహ్వానముపై సుమారు మూడువందల స్త్రీలును, రెండువందల పురుషులును హాలునిండ చేయుండిరి. దెలికత్తె, నృత్యము, నాట్యకత్తెగా నటించిన ప్రేక్షకుల నానందింపజేసిన పోచమ్మ యను బాలికకు శ్రీరాజా బహద్దరుగారు ప్రత్యేకముగా నొకపతకము నిచ్చెదమని సెలవిచ్చిరి. ప్రేక్షకులలో ముఖ్యులు శ్రీ కింగ్ కోఠీ కోదండరామరెడ్డిగారును, మాడపాటి హనుమంతరావుగారును డాక్టరు నాయని సాయమ్మగారును దయచేసిరి. హాలంతయును ముఖ్య నటులు డాక్టరుగారి మునిమనుమరాలి విలాసమునకు చాల సంతోషముగా నున్నది.

ఇట్లు విన్నవించు
ప్రేక్షకురాలు

### జవహార్లాలునెహ్రూగారి ఆంధ్రరాష్ట్ర సంచారకాలము

కాంగ్రెసు అధ్యక్షులగు పండిత జవహర్లాలునెహ్రూగారు ఆగస్టు రెండవపక్షములో ఆంధ్రరాష్ట్ర సంచారము వీలుగావచ్చునని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులగు టంగుటూరి ప్రకాశంపంతులుగారికి జాబువ్రాసిరి.

## జాతిసమితి రాజ్యములు చేసిన సహాయము సున్న

జాతిసమితి కౌన్సిలు సభలో
అబిసీనియా చక్రవర్తి ఉపన్యాసము

సమితి మహాసభ సమావేశము నేడు ప్రారంభము కాగానే ఇంతవరకు మహాసభ అధ్యక్షులుగనున్న డాక్టరు బీనృగారు అధ్యక్షపదవికి పంపిన రాజీనామా లేఖను ఈడెనుగారు చదివిరి [డాక్టరు బీనృగారు జెకోస్లావేకియా రాష్ట్రపు అధ్యక్షులుగ ఎన్నుకొనబడుటచే సమితిమహాసభ అధ్యక్షపదవికి రాజీనామా ఇయ్యవలసివచ్చెను వీరిస్థానమున బెల్జియం ప్రధానమంత్రి వీం జీలాండుగారు సమితిమహాసభ అధ్యక్షులుగ ఎన్నుకొనబడిరి

వీంజీలాండుగారు అధ్యక్షస్థానము నలంకరించి సభను ప్రారంభించిరి. పిమ్మట ఇటలీ ప్రభుత్వమువారు పంపినలేఖను ఇటలీ ప్రతినిధి సమితి అధ్యక్షునకు అందజేసిరి సమితి సంస్కరణము అవసరమనియు ఇందులకు ఇటలీప్రభుత్వమువారు యథాశక్తి తోడ్పడెదరనియు ఈలేఖయందు సూచింపబడినది

అర్జెంటైను ప్రతినిధి కౌంటిల్లాగారు మాట్లాడుచు ఇట్లు చెప్పిరి —

బలప్రయోగమువల్ల స్వాధీనపరచుకొనిన రాజ్యభాగముల ఆధిపత్యమును సమితిసభవారు అంగీకరింపకూడదు న్యాయమూత్రములను అన్ని సభ్యరాజ్యముల విషయమునను ఎట్టి పక్షపాతము లేక అనువర్తింప జేయకున్నచో సమితి సభ్యత్వమును మానుకొను విషయమై అర్జెంటైను ప్రభుత్వమువారు ఆలోచింపవలసి యుండును

పిమ్మట అబిసీనియా చక్రవర్తిగారుపన్యసించుచు ఇట్లు చెప్పిరి —

### విషవాయువుల ప్రయోగము

"ఇటలీవిమానములుజట్లుజట్లుగ అబిసీనియా రాజ్యమునందంతయు ఎచ్చటవిడిగ తిరుగుచు విషవాయువులతో నిండిన బాంబులను వర్షించిరి ఈఅమానుష కౌర్యమువల్ల సైనికులేగాక నిరాయుధులగు సామాన్య ప్రజలు, పశువులు, పంటలు ధ్వంసమైనవి త్రాగుటకు మంచినీరు దొరుకుటకూడ దుర్లభమయ్యెను ఈ దురంతములచే కలిగిన కష్టములను సహించిన నేను ఈ దురంతములను మీకు విశదపరచుటకు ఆరుడనై యున్నాను అబిసీనియా ప్రజలపట్ల ఇటలీయులొనర్చిన గొప్పనేరమును నిరూపించుటకై నేను న్యాయమును ఇచ్చటికి వచ్చితిని అబిసీనియా ప్రజలయందు ఐకమత్యము వృద్ధిచేయవలయునని నేను గావించినప్రయత్నములన్నియు ఇటలీయుల మత్రమువల్ల భగ్నములైనవి

### రహస్యపు టొడంబడికవల్ల కలిగిన ఫలితము

అబిసీనియాతో యుద్ధముచేయుటకై గత సంవత్సరములనుండియు ఇటలీ ప్రభుత్వమువారు సన్నాహములను గావించుకొనుచుండిరి కాని ఐరోపా ఖండమునందొక రాజ్యము ఇటలీతో స్నేహముగ నుండవలయునను ఉద్దేశ్యముతో రహస్యముగ చేసికొన్న ఒడంబడికవల్ల ఇటలీ పరిపాలితపరిణామము యేర్పడినది ఈ రహస్యపు టొడంబడికవల్లనే అబిసీనియా యుద్ధపుస్వరూపము కల్పనాసుముగ మారినది

సమితిరాజ్యము లొసగిన సహాయమేమి?

బలవంతములగు రాజ్యములతోసహా ౫౦ రాజ్యములు ఇటలీచర్యను జెనీవలో ఖండించి దౌర్జన్యమునకు గడంగిన రాజ్యము జయము గాంచినట్లు పనిచేయ నాకు అవకాశమొసగెను సమితికి జయముకలుగునని నేను నమ్మియుంటిని సమితి ఆశయములను ఆచరణయందుంచుమని పయమున ఈ ౫౦ రాజ్యములు అబిసీనియాకు నిజముగ ఎట్టిసహాయమొసగెనో ప్రశ్నించుచున్నాను ఆయుధసామగ్రి విషయమున ఇటలీకి ఎట్టికొరత లేకుండెను అబిసీనియాకు ఆయుధములను ఎపెచేయు విషయమున ఎన్నియో అన్యాంతరములు కలుగజేయబడెను

నామిట్లుకు నాకు లాభకరమగు సూచనలనన్నిటినో ఎటలీ అధికారులు తెలిసికొని నా ప్రజలపట్ల ద్రోహము సలుపవలయునని ప్రోత్సహించిరి నేను ఇట్టి ఆలోచనలను తిరస్కరించి చిన్నరాజ్యముల స్వాతంత్ర్యమునకై పోరాడవలయునని సంకల్పించుకొంటిని

### ఆంక్షల విధానము

ఐరోపా ఖండమునందు మూడురాజ్యములు ఆంక్షలవిధానమును అమలునందే యుంచలేదు మరికొన్ని రాజ్యములు సమితినిర్ణయములను అనుసరించుచున్నామని బహిరంగముగ ప్రకటించుచు ఆచరణయందు నిరాదరణ చూపుచుండిరి ఆర్థికసహాయ మొసగవలయునని అబిసీనియా ప్రభుత్వమువారు సమితికిపంపిన విన్నపములు నిరాకరింపబడెను సమితినిర్ణయపు ౧౬-వ అధికరణను ఆచరణలోనికి తెచ్చుట ఇట్లేనాయని ప్రశ్నించుచున్నాను

### ఫ్రాన్సువైఖరి

యుద్ధసమయమున అబిసీనీయులు జాబేటి రైలుమార్గము నుపయోగింపగూడదని ఫ్రాన్సు అధికారులు ఉత్తరువులనొసగిరి ఇప్పుడు ఇటలీయనులు జంకుగొంకులేక ఈ రైలుమార్గము ద్వారా తమసేనలను పంపుచున్నారు ఇదియే నా ఫ్రాన్సు ప్రభుత్వమువారు అనుసరింపవలసిన తటస్థవిధానము అంతర్జాతీయ వ్యవహారములందు ధర్మమార్గము ననుసరింపవలయునను సిద్ధాంతము భిన్నమైనది ఈసమయమున సమితి నాకు సౌఖ్యము కలుగజేసికొని పలుబాధలకు లోనైన నాదేశపు ప్రజలకు తోడ్పడవలయునని కోరుచున్నాను మీరీసమయమున గావింపగల న్యాయమును భావిచరిత్రకారులే గాక భగవంతుడుకూడ పరిశీలించును.

నాప్రజలకు మీవద్దనుండి ఎట్టిప్రత్యుత్తరమును తీసికొనిపోవలయునో సెలవివ్వవలయునని కోరుచున్నాను"

## కన్నడీయహరిజనులు తెలుగుబడినే కోరుట

బళ్ళారిజిల్లా హరిజనసేవకసంఘము యొక్క కార్యనిర్వాహక సంఘసమావేశము ౨౬ జూను శుక్రవారము నాడు సాయంకాలము జరిగెను ఆసమావేశములో హరిజనుల ఇక్కట్లను బాపుటకై కొన్నిసూచనలు తీర్మానించుకొనబడి ఆసూచనలను బళ్ళారిజిల్లాకలెక్టరుగారికినివ్వవించుటకు ఒకఉపసంఘము యేర్పరచబడెను ఈతీర్మానములలో నొకటి ఆంధ్రులకు గర్వమునొసగునట్టిది కనక ఆదిమాత్రమిచట పేర్కొనబడుచున్నది బళ్ళారి హైరుహాను స్కూలు హరిజనులకు విద్యనొసగుటకై స్థాపించబడినట్టిది అక్కడి హరిజనుల మాతృభాష కన్నడము కాబట్టి ఆబడిలో కన్నడములోనె విద్యచెప్పబడుచున్నది కాని అక్కడి హరిజనులు తెలుగులో చదువుచెప్పనిచో తమ పిల్లలను ఆబడికి పంపెదమనుచు ఆనేకులుతమ పిల్లలనిపుడాబడికి పంపుటలేదు, కనుక ఇపుడు ఆబడిని తెలుగుబడి చేయవలెనా, లేక బడినే ఎత్తివేయవలెనా' అను ప్రశ్నవచ్చెను ఒకపెద్ద విషయమును నిర్ణయించుటకు ఒకఉపసంఘమును నియమించవలెనని సూచించెను కాని మరికొందరు హరిజనులే తెలుగుకావలెనని కోరుచుండ ఆలోచనయేలనని వాదించిరి తుదకు తెలుగుబడి చేయుటకు తీర్మానించబడెను

— —

చక్రవర్తిగారు అమహారికభాషయందుపన్యసించిరి వీరిఉపన్యాస తర్జుమా వెంటవెంటనే మయిక్రోఫోనుద్వారా తెలుపబడెను చక్రవర్తిగారుపన్యసించుచున్నంత కాలము సభ నిశ్శబ్దముగ నుండెను ఉపన్యాసము ముగియగనే సభ్యులు కొన్నినిమిషముల కాలము కరతాళధ్వనులు గావించిరి ఉపన్యాసముముగించి చక్రవర్తిగారు సభను వదలిపోయిరి అప్పుడుకూడ సభ్యులు హర్షధ్వనులు గావించిరి

### సమావేశము వాయిదా వేయబడుట

అంతటితో సమావేశము మరుసటికి వాయిదా వేయబడెను రేపు ౧౦-౩౦గంటలకు మరల సమావేశము ప్రారంభమగును

## మహాకమా నజామతు ఆబ్కారి ముల్కు-సర్కా-రెఆలీ

## ఇష్తెహారు

దీనివల్ల తెల్యచాయటము ఏమనగా హుమాదుఆబ్కారిజిల్లాసికింద్రాబాదు వ జిలేమెదకు, అత్రాఫుబల్దా, వ మహబూబునగరు, వ తాలూకాభోనగీరు, పట్టీ బీపేట, రాజంపేట మాల్ తుమ్మెద, తాలూకా కామారెడ్డి, యెల్లారెడ్డి జిలా నిజామాబాదు, వ పర్భని, కరీంనగరం, వుస్మానాబాదు, ఆవలాబాదు బీడు, బీదరు మొదలగుజిల్లాలలో మకరానుసిస్టము జారీఅయ్యివున్నది కావున యేగ్రామము యింతెజాంఅయితే మదరానుసిస్టంపైనఅయినదో ఒకవేళఆగ్రామములలో నెంబర్లువేయకుండా గీయుటము విషయమయ్యి యెవరైన మొగుబరి చేసినట్లుఅయితే మొగుబరుకు జేరెతావానుండి చెట్టువక్కంటికి అర్ధరూపాయివరకు యెన్ని ట్లు బిలానంబరు గీయబడినట్లు సుబూతుఅవునో ఆప్రకారము యివ్వబడును మొగుబరిచేశేవాడు దరఖాస్తుమొగుబరిలో పూరిపేరు గుంటిపేరు లేక సర్వేనెంబరువ్రాసి టప్పా [illegible]ర్యాన మొహాతమీంజిలాకు లేకమహాకమానజామతుకు పంపవలెను సదరుదరఖాస్తులో యెన్నిరోజులనుంచి గీస్తువున్నది లేక గీయుటము అయ్యివుంటె యెన్నిదినములుఅయినది సలాహాతు చేయవలసినది మొగుబరిచేసేవాని పేరు రహస్యముగా ఉంచబడును. యెవ్వరికిని లియచేయబడదు.

గులాంహుసేన్
మదద్గారు నాజం ఆ౯





## వర్ణాంతర వివాహములు న్యాయసమ్మతములైనవే

(౧౨వ పేజీ చూడుడు)

కోర్టుతీర్పులను ఆధారముగా స్వీకరించుట సుసాధ్యముకాదు.

హిందూసంఘము మొన్నటివరకు శిష్టలోకవ్యాఖ్యానముగా స్థాపనక్రమమున కాలోచితముగా క్రొత్త క్రొత్త మార్పులను చెందుచూ అనాదినుండియు క్రమవికాసము చెందుచుండెను. శాస్త్రనియమములను ఏర్పరచిరి. కాని ఆశాస్త్రములకు వ్యాఖ్యాతలు క్రొత్త భాష్యములను క్రొత్త అన్వయములను వ్రాయుచువచ్చిరి. ఉదా నిజప్రియమైన. నేటికాలమున మనము క్రొత్త హైకోర్టుతీర్పులను వర్తింపజేసి తగాదాలనుపరిష్కరించుచుండినట్లుగా నున్నది. ఒక్కొక్క క్రొత్తతీర్పు వచ్చుటవల్ల ఒక్కొక్క నూతన విషయము న్యాయవిచారణయందు నిర్ధారణ యగుచున్నది. కాలక్రమముగా కోర్టులలో నున్న న్యాయనిర్ణయము క్రమవికాసమును పొందుచున్నది. ఇదేవిధముగా పూర్వకాలములో వ్యాఖ్యాతలయొక్క నూతన భాష్యములవల్ల ధర్మశాస్త్రములకు అన్వయవ్యాప్తి మారుచూ వచ్చినది.

డాక్టరు భగవానుదాసుగారు

న్యాయవిచారణాధికారుల నిర్ణయములు ఎప్పుడేనిగా నుండగలవో చెప్పుటకు వీలులేదు. ఒక్కొక్క న్యాయమూర్తి విశాలదృష్టి గలవారై నిష్పక్షికముగా న్యాయనిర్ణయము చేయవచ్చును. మరొకడు సంకుచిత శతంత్రబుద్ధితో పక్షపాతసహితుడై తీర్పు చెప్పవచ్చును. వారితీర్పులు పరస్పరవిరుద్ధములుగా నుండగలవు. అట్టితీర్పుల ననుసరించి చెల్లవగిన వివాహము లేవో చెల్లకూడనివేవో ఉత్తరోత్తర న్యాయనిర్ణయము చేయవలెన నేయొడల గాలిలో దీపము పెట్టినట్లగును. మన హిందూసంఘములోని నేటికాలపు పండితులు కేవలము సంస్కృత గ్రంథ పాండిత్యమువల్లనే పండితులుగాని ప్రపంచవ్యవహార పరిస్థితులను యుగధర్మముల ను గ్రహించునట్టి లోకపరిజ్ఞానులు కారు. కనుక. అధునిక వ్యవహార ధర్మములను గ్రహించిన న్యాయాధికారులే ఇట్టి న్యాయనిర్ణయములను చేయవలసినవారై యున్నారు. ప్రభుత్వ శాసనముద్వారానే వారు తమనిర్ణయములను వర్తింపజేయవలసి యున్నారు.

అదియునుగాక, ధర్మశాస్త్ర ప్రమాణముల ను చూపించి ఏదైన నొక హిందూవివాహము చెల్లదగినిదేయని కోర్టులలో మనము సమర్థించి నప్పటికిని, పూర్వాచారము ననుసరించియు, ఆమలులో నున్న సంప్రదాయమునుబట్టియు అది చెల్లకూడదనియు పూర్వపక్షము చేయబడవచ్చును. కనుక కోర్టుతీర్పులద్వారా గాక, ప్రభుత్వశాసనముద్వారానే యీవివాహములన్నియు చెల్లదగినవని నిర్ణయించవలసియున్నది. మనుస్మృతి కర్తల యభిప్రాయానుసారము గాశాస్త్రపరిశో

## భారత సంస్థాన ప్రజల సమావేశము

జులై ౧౧, ౧౨ తేదులందు కరాచీలో జరుగుట

ప్రధానకార్యదర్శి ప్రకటన

కరాచీ. జూలై ౨౭,-

భారత సంస్థానప్రజల సమావేశ ప్రధాన కార్యదర్శియగు బలవంతరాయి మెహతాగారీక్రింది ప్రకటన గావించిరి:-

"భారతసంస్థానప్రజలు ౮ కోట్లమందిగలరు, వీరిప్రతినిధుల సమావేశము జూలయి ౧౧, ౧౨ తేదులందు కరాచీలో జరుగును. వివిధ సంస్థానములకు, మతములకు, వర్ణములకు, పక్షములకు చెందిన ౧౫౦ మంది ప్రముఖులతో ఆహ్వాన సంఘమున పలువురు సభ్యులుగా చేరుచున్నారు. కార్మికనాయకుడగు నరేంద్ర ఆనందజీ దేశాయిగారిని అహ్వాన సంఘాధ్యక్షునిగా ఎన్నుకొనిరి.

సుప్రసిద్ధకాంగ్రెసు నాయకుడగు డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు సమావేశమునకు తోడ్పడుచున్నారు.

కాంగ్రెసు అధ్యక్షుడగు పండిత జవహరలాల్ నెహ్రూగారు సమావేశమునకు హాజరగుదురు. పండితుడు సమావేశ ప్రారంభోత్సవము జరుపుచు సభలో ఉపన్యసించెదరు, సంస్థానములలో అధోగతియందున్న ప్రజలనుద్ధరించుటకు కృషి సలుప వలసిన అవశ్యకతను గూర్చి వీరు ముచ్చటించెదరు.

ఫెడరేషన్ తోపాటు సంస్థానప్రజలకు ఇబ్బందులు ఎక్కువగును. సంస్థానప్రజలు నిద్రపోవుచు ఇప్పడూరకుండిన. తర్వాత పెక్కుకష్టములపాలగుదురు. సంస్థానప్రజలు తమ, అభివృద్ధికి అనుకూలించు విధానమును కరాచీసమావేశమున నిర్ణయించవలెను."

### పండిత నెహ్రూగారి సన్మాన సన్నాహము

కరాచీ, జూలై ౨౯:—

పండిత జవహరలాల్ నెహ్రూగారు జులై ౧౧ తేది కరాచీవచ్చెదరు. సంస్థానప్రజల సమావేశమునకై వీరు వచ్చుచున్నారు. వీరికి స్వాగత కార్యక్రమమును అప్పటికప్పుడే తయారుచేసిరి.

కాంగ్రెసు, కార్మికసంఘములు, కాంగ్రెసు సాంఘికవాదులు, వర్తకసంఘములు, పండితనెహ్రూగారిని ఆహ్వానించెదరు. బహిరంగ సభల నేర్పాటుచేయుదురు, కాంగ్రెసు అధ్యక్షుని కరాచీ పురకార్పొరేషన్ వారు విందునకు ఆహ్వానించియుండిరి. (యు. ప్రె.)

ధనలకును శుచి ఆరోగ్యవిధానములకును. వివేకమార్గములకును. నూతనశిల్పాది కళలకును వర్తించెడి మంచిమంచి శాసనముల నన్నింటిని సేకరింపవలసియున్నది.

"స్త్రియోరత్నాన్యథోవిద్యా
ధర్మఃశౌచం సుభాషితం
వివిధానిచ శిల్పాని
సమాదేయాని సర్వతః"

(మనుస్మృతి)

నేను వివరించిన కారణములన్నింటివల్లయీ శాసనమును హిందూసంఘ శ్రేయోభిలాషులందరును ఆమోదింపవలసినదిగా కోరుచున్నాను. అందువల్ల హిందూసంఘము తిరిగి చిగిరించి నూతన జీవకళతో వర్ధిల్లగల్గుటకై యీసంఘమునకు ప్రాణదానము చేసినవార మగుదుము.

## ఒక వింత దినపత్రిక

ఐరోపాఖండమునందు హంగరీదేశమునకు రాజధానియగు బుడాపెస్టునగరమున బిచ్చమెత్తి జీవించువారందరును కలిసి ఒక దినపత్రికను ప్రారంభించిరి. సంపాదకవర్గమువారందరును బిచ్చగాండ్రే వారందరును ఒక హోటలులో సమావేశమగుచుందురు. ప్రధాన సంపాదకుడు ఉదయమునుండి సాయంకాలమువరకును ఆచటనొక బల్లమీద సారానీసాను పెట్టుకొనికూర్చుండును. నగరమునందన్ని భాగములలోను జరిగిన వార్తలను బిచ్చగాండ్రువచ్చి తెలియజేయుచుందురు. పత్రికపూర్తికాగానే సైపుచేయబడును బిచ్చగాండ్రు దానికి ప్రతులు సిద్ధపరచి తీసికొనిపోయి ఒక పంచిక ఒకపెన్నీ చొప్పున విక్రయించెదరు, ఆనగరమున కొంతమంది బిచ్చగాండ్రు పైసెన్నులు పొందకుండ నివృత్తి నవలంబించి చాలాధనమును గడించుచున్నారు. వారిలో చాలమందికి స్వంతయిండ్లుగూడ నున్నవి. అట్టివారినిగూర్చి యీ పత్రికలో ప్రకటింపబడుచుండును.

## పశువుల అంటుజాడ్యములగూర్చిన శాసనము

సిమ్లా; జులై ౧:-

పశువులకు తగులు అంటుజాడ్యముల విషయమై శాసనము గావింపవలెనని కొంతకాలము నుండియు ఇండియాప్రభుత్వమువారాలోచించుచుండిరి. గాని ఈ సంవత్సరము శాసనముగావించు నవకాశము లేనట్లు కనబడుచున్నది. ఇండియాప్రభుత్వవారిచే తయారుచేయబడిన తాత్కాలిక చిత్తుశాసనము రాష్ట్రీయప్రభుత్వముల యభిప్రాయములకై పంపబడినది. ఈ సంవత్సరాంతమునగాని రాష్ట్రీయ ప్రభుత్వములనుండి ప్రత్యుత్తరములు రావు కావున వచ్చే సంవత్సరము బడ్జెటు సమావేశము వరకు భారత శాసనసభలో బిల్లు ప్రతిపాదింప వీలులేదు.

# రెండవ దశాబ్ద ప్రారంభమున

"ఆంధ్ర" నూతన దశాబ్దసందర్భమున ఎల్లరకును అభివాదముల నర్పించుచున్నది.

సర్వతోముఖమగు అభివృద్ధిగాంచి, శీఘ్రగతిని ముందుకు సాగుచునది.

పేర్కొనదగిన సుస్థిరత్వమును బడసినది.

పైవిషయములు, తామేపరిశీలించి, తమ సంపూర్ణ సహకారాదరణముల నొసంగుదురుగాక!

ప్రతి మూడు సం॥ రముల అభివృద్ధి

| సంవత్సరం | | అమలులోనున్న వ్యాపారం. | శీమానిధి. | ప్రీమియం ఆదాయము. |
|---|---|---|---|---|
| 1928 | ... | రు 19,20,000 | రు 56,000 | రు 77,000 |
| 1931 | ... | ,, 43,30,000, | ,, 3,27,000 | ,, 2,11,000 |
| 1934 | ... | ,, 79,34,000 | ,, 9,06,000 | ,, 3,67,000 |
| **1935** | ... | **1,00,00,00** | **11,50,000** | ... **4,62,000** |

1935 లోకొత్తవ్యాపారము    రు **27 10 000**

1934 సంవత్సరము    రు **22,0,000**

## ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ. (లిమిటెడ్)

నిజాంరాష్ట్రమునకు ఛీఫ్ ఏజంట్లు:—

జి. జగన్నాథం

నెం. 3 జీరా, సికింద్రాబాదు

మచిలీపట్టణము

---

## కలరా కలరా

కు    భీతిజెందకుడు.

రాకు దివ్యౌషధము

డ్రాప్స్ మిమ్ము కాపాడగలదు.

గ్రహణి, అతిసారము, కలరా రక్తవిరేచనములు, కడుపుబ్బరములు అజీర్ణము, వాంతిభేదులు మొదలగువాటిని తప్పక కుదుర్చును. రెండు మూడు మోతాదులు పుచ్చుకొనినచో కలరా వలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును. అనేకులు మా విక్టర్ డ్రాప్స్‌ను ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రముల నొసగియున్నారు. కలరా వ్యాధులకు వాడబడుచుండు ఔషధములలోకెల్ల మావిక్టర్ డ్రాప్స్ ప్రశస్తమైనదని డాక్టరులు పొగడియున్నారు. మరియు అన్ని వయసులవారికిని నిర్భయముగా వాడవచ్చును.

సోల్ ఏజంట్లు: విక్టర్ అండు కో

పెద్దగడియారం హైద్రాబాద్ దక్కన్

దవాఖాన, విక్టర్ అండుకో

సుల్తానుబజారు

---

## కావలెను.

టెలిగ్రాఫు మరియు స్టేషన్ మాస్టర్ తరగతులకు అభ్యర్థులు. అలవెన్సు రూ ... యూనిఫారం, బస ఉచితము. పని ముఖ్యము. నిబంధనలు ప్రవేశదరఖాస్తుఫారంరాఅణాలుపంపినచో పంపబడును. డైరెక్టర్. రాయల్ టెలిగ్రాఫు అండ్ రైల్వే ట్యూటిన్ కాలేజి, బొంబాయిగిర,

---

GRAMOPHONE SHOWROOM

JAMBAGH

B. G. CHIMALGI.

ఫోను

రికార్డులు

భవనము

అన్ని రకముల తెలుగుగ్రామఫోను రికార్డులు మావద్ద దొరకును. స్త్రీలువచ్చి చూచుటకు ప్రత్యేకమగు ఏర్పాటుగలదు.

బి. జి. చిమల్గి

జాంబాగు, హైదరాబాదు దక్కన్.

---

## సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, లిమిటెడ్

హైదరాబాదు,    సికింద్రాబాదు.

మేము మాయీ రజతోత్సవ సందర్భములో వసూలునకై మాపరముగావచ్చు బిల్లులకు నైశ్వేరశీదు ఉన్నను లేకున్నను క్రొత్తసంవత్సరమునుంచి వాటివసూలురేట్లను చాలా తగ్గించినామని తెలుపుటకు ఆనందము కలుగుచున్నది.

బిల్లుకు నాలుగుఅణాల చొప్పున యిప్పుడుండుచార్జి నిపూర్తిగతీసివేసితిమి వసూలు చార్జీలు నూటికి 4 అణాలనుంచి నూటికి 2 అణాలకు తగ్గించబడినవి, కాని 1 బిల్లుకు కనీసపు ఛార్జీ 4 అణాలు.

ఇందు మాపూర్వపు ఖాతాదారులు ఇంతకుముందుకంటె ఎక్కువబిల్లులు తెచ్చుటకు ఉత్సాహపడుదురని నమ్ముచున్నాము. హిందూదేశమంతటను 80 శాఖలును, పేఆఫీసులునుగల్గి హిందూదేశములో ప్రధానమగు నీజాయింటుస్టాకు బ్యాంకువలన క్రొత్తఖాతాదార్లకుకావలసిన పనులు చౌకగాను నిరుపద్రవముగాను నెరవేరగలుగునని నచ్చజెప్పుచున్నాము.

ఇ. థామస్

హైదరాబాదు(దక్కన్) శాఖ ఏజంటు.)

---

## డోంగ్రేగారి

## బాలామృతము

బలహీనమైన బిడ్డలకు పుష్టియు న్నూ బలమున్ను, ఆరోగ్యము నిచ్చును.

అన్నిస్థలములందు దొరకును.

ప్రొప్రయిటరు:—

కె. టి. డోంగ్రే అండ్ కో

గిర్‌గాం-బొంబాయి.

---

## శ్రీ కృష్ణ భవన్ రెస్టారెంట్

రుచ్యమగు ఫలాహారములు, మంచిభోజనము, ప్రయాణీకులకు విశ్రాంతి సౌకర్యములు అన్నియు చౌకవెలలలో లభించగలవు. కేషనరి సామానులుకూడ ఇచట అమ్మబడును.

కె. యర్. కృష్ణయ్యారు, ప్రొప్రయిటర్.

కింగ్ కోటిరోడ్డు, హైద్రాబాద్ [దక్కన్]

తనమాతృభాషాజ్ఞానముకే
నిఘాని తీయుని
ఏమనవలెన?
అతనిని జాతీయుడని
చెప్పదగునా???

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN
The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper
for H.E.H. The Nizam's Dominions.

వర్తకులకు
నిజాంరాష్ట్రపు ఎనిమిది
జిల్లాలలోని ఆంధ్రుల
లో మీవర్తకవృద్ధికి
సాధనము? గోలకొండ
పత్రికలో ప్రకటనము

Vol. 11. | Monday 6—7—1936 | No. 17

# వర్ణాంతర వివాహములు సక్రమములైనవే

౬ మరియు ౭

వ్యాసకర్త

## డాక్టర్ భగవానుదాసుగారు

### ఈశాసన ప్రయోజనము

ఇప్పుడు అమలులో నున్న శాసనావకాశములవల్ల అట్టి వివాహములను చేసికొనవచ్చునే గాని ఆస్తిసొత్తులగూర్చిన హక్కు సౌకర్యములనుగాని, దత్తతచేసికొనే హక్కులనుగాని కొన్నింటిని అట్టి వివాహితులు వదలుకొనవలసినవారగుదురు. వారిసంతతికిగూడ కొన్ని వారసత్వపుహక్కులు లభించుటలేదు లేదా అట్టి వివాహములు చేసికొనదలంచినవారు తమతమ మతములు వదలుకొనవలసినవారగుదురు. లేదా తాము ఏమతసంఘములోను చేరినవారము కామని ప్రమాణము చేయవలసినవారగుదురు.

అట్టిషరతులకు లోబడి వర్ణాంతరవివాహములను చేసికొనదలంచినవారికి అమలులోనున్న శాసనావకాశము లేచాలు. కాని, అట్టి అవరోధములు లేకుండ వర్ణాంతరవివాహములను చేసికొనుటకు సంపూర్ణ స్వాతంత్ర్య సౌకర్యముండవలెనని కోరెడివారికొరకై యీవర్ణాంతరవివాహశాసనము అవశ్యకమై యున్నది. కనుక హిందూసంఘములోని ప్రముఖు లందరును యీచట్టమును ఆమోదించేయెడల, జాతీయ దార్ఢ్యాభివృద్ధికిని, మనోవికాసమునకును బాగా యుపకరింపగలదు.

### విడాకులనిబంధన చేయనిది ఎందుకు

శారదా అక్టుప్రకారం నిర్ణయింపబడిన "వివాహార్హవయ" ప్రమాణముకంటె ఎక్కువ ముదురువయస్సుగల వధూవరులే సర్వసాధారణముగా వర్ణాంతరవివాహమునకు ఉద్యుక్తులు కాగలరు. అట్టి ముదురు వయస్సులోనున్న యువతీయువకులు వివాహమాడునప్పుడు వారు సుస్థిరప్రేమాను రాగబద్ధులై అట్టి దాంపత్యమును కోరగలరు. వారు మంచి లోకజ్ఞానము కలవారై యుందురు. తమదాంపత్యబాధ్యతలను గుర్తెరింగినవారై వివాహమాడ గోరుదురు. అట్టివారు యావజ్జీవ పవిత్రదాంపత్యమునే అనుష్ఠించుటకు ప్రమాణము చేసి, అప్రకారమే సంసారము చేయనగునని నా ఆశయము. వారు ఎప్పుడు కోరితే అప్పుడు ఇచ్ఛామాత్రమున విడాకులు నిచ్చుకొనవచ్చునను సౌకర్యమును శాసనములో నొసంగినయెడల, ఈ అవకాశవిషయమే వారి హృదయములందు ఆయుధమువలె తళుకు మనుచునే యుండును. దాంపత్యవిచ్ఛిత్తికి యీ ఆయుధమును వారు ప్రయోగించుటకు తాత్కాలికోద్రేకపూరితులై నప్పుడెల్ల పూనుకొను చుండగలరు. అట్టిఆయుధ మొకటి వారి సంసారయాత్రలో వారిద్దరిమధ్య భద్రపరచబడిన ఆయుధమువలె విడాకుల స్వాతంత్ర్యాధికార మొకటి యీ చట్టములో చేర్పబడుట శ్రేయస్కరమని నాకు కన్పించుటలేదు.

భిన్నభిన్నవర్ణములతో శాఖలుగా చీలిపోయిన హిందూసంఘమును సమ్మేళనము చేయుటకొరకై యీచట్టమును ఉద్దేశింపబడినది. సమ్మేళనమునకై ఉద్దేశింపబడిన యీచట్టములో దాంపత్య విచ్ఛేదనా స్వాతంత్ర్యము వంటి పృథక్కరణ సాధనములను చేర్చుట ఈ శాసన ప్రయోజన పరమార్థమునకు విరుద్ధము.

ఏసంసారములోనైనను భార్య భర్తవల్ల భరింపరానికష్టముల పాలైనప్పుడు అట్టి దుర్భరావస్థను ఆమె సహించుకొనవచ్చును, అమె సంకటములు భరించలేనప్పుడు ఆమెకు బంధవిమోచనము ఉండవలెను ... కొన్ని అవకాశములు కల్పింపబడియున్నది. కులపెద్దలు పంచాయతీచేసి అట్టి సంసర్భములలో న్యాయాన్యాయ విచారణచేసి దాంపత్యవియోగము చేయించవచ్చును. కాని. ఆధునిక న్యాయవిచారణాపద్ధతిప్రకారం మిప్పుడు కోర్టువారే పంచాయితీదారుల సాక్ష్యమును విని భార్యకు మనోవృత్తిని ఏర్పాటు చేయవచ్చును. ఆమెపిల్లలకు తగిన జీవనోపాధినిగూడ కలుగజేయవచ్చును.

### ఏకపత్నీ నియమము

వర్ణాంతరవివాహము చేసికొనెడివాడు, అదివరకింకొకభార్యను పెండ్లాడియుండినవాడుగానుండరాదనునియమనిబంధన యీ చట్టములో ఉండవలెనని కొందరు కోరుచున్నారు.

దేశములో ఏర్పడియున్న ఆర్థిక దుస్థితివల్లనే బహు భార్యాత్వము క్రమేణ నశించుచున్నది బహు పత్నీత్వము దూష్యమని స్త్రీలే సభలుచేసి నేటికాలమున నిందించుచున్నారు. ఒక్కభార్యను వివాహమాడుటకుకూడ చాలమంది ముందువెనుకలు చూచుకొని తగిన సంపాదన లేకపోతే వివాహమాడుట మానివేయుచున్నారు కనుక, బహుపత్నీత్వ నిషేధనియమము యీచట్టములో చేర్చవలసిన యగత్యము నాకు కన్పించుటలేదు.

ఒకడొక వర్ణాంతర వివాహమును చేసికొనినపిదప ఆమె జీవించియుండగా మరొక స్త్రీని వివాహ మాడేయెడల మొదటిభార్యకు విధిగా తగిన మనోవృత్తిని యివ్వవలసిన వాడగును. వివాహకాలమందు చేసెడి ప్రమాణములనుబట్టి గర్త తాను ఆర్జించినదానిని భార్య హస్తగతముచేయవలెను. అట్టప్రమాణమునకు విరుద్ధముగా అతడు మరొక భార్యచేతిలో తన ఆర్జనము పెట్టదలంచినప్పుడు తన పూర్వవివాహ ప్రమాణమును ఉల్లంఘించిన వాడగును గనుక, మొదటిభార్యకు మనోవృత్తి నీయవలెను. వివాహ ప్రమాణమునకు కంట్రాక్టు కాగితమున కున్నంత విలువకలదు.

వర్ణాంతర వివాహములనుగూర్చి యీ కట్టకడపటి వ్యాసమును నేను వ్రాయుచుండగా, ప్రీవీకవున్సిలు తీర్పు ఒకటి పత్రికలలో ప్రకటింపబడుట నేను చూచితిని.

౨౩-౪-౩౬ తేదీని ప్రీవీ కవున్సిలువారు యీతీర్పును యిట్లీవలనే చెప్పియుండిరి.

కేసుసంగ్రహము యీక్రిందరీతిగా నుండెను.

... అనే అమెను వైద్యనాథు అను నతడు వివాహమాడెను ఇద్దరును ద్విజులైన వైశ్యులే. కాని వైశ్యకులములో చేరిన భిన్నశాఖలకు చెందినవారై యుండిరి. కొంతకాలమైనతర్వాత భర్తయగు వైద్యనాథు మరణించెను. జగ్గో వితంతువయ్యెను. కాని, ఆమె వైద్యనాథునితమ్ముడగు శివనాథుని పెండ్లాడెను. శివనాథుకు అదివరకే ఒకభార్యకలదు. సవతులిద్దరును తరచుకలహించుచుండుటవల్ల శివనాథుడు జగ్గోను విడిచిపెట్టెను భర్తచేత వర్జింపబడిన యీమెను నిక్కాలాలు అను నతడు "సాగాయి" అను క్రియాకలాపమును జరిపినతర్వాత పెండ్లాడెను. ఈ పెండ్లి జరిగిననాటికి శివనాథుడు జీవించియేయుండెను. నిక్కాలాలు కొంతకాలమైనతర్వాత మరణించెను. నిక్కాలాలు వైశ్యుడైనను అన్యశాఖీయుడు. నిక్కాలాలుకు స్వశాఖీయురాలైన ప్రథమకళత్రమువల్ల గోపీకృష్ణుడను కుమారుడు కలడు జగ్గోవల్ల శ్రీకృష్ణుడను కుమారుడు కలిగెను. నిక్కాలాలు చనిపోయినతర్వాత 'అతనిఆస్తియావత్తున్ను తనకే చెందవలెనని గోపీకృష్ణుడు తగాదాచేసెను జగ్గోవల్ల కలిగిన శ్రీకృష్ణునకు సగభాగము చెందుటకు వీలులేదనియు, జగ్గో స్వశాఖీయురాలు కాదు గనుక నిక్కాలాలుకును ఆమెకును జరిగిన వివాహము సశాస్త్రీయమైన హిందూవివాహము కాదనియు అందువల్ల ఆమెకు కలిగిన కుమారుడు ఆస్తికి భాగస్వామి కాజాలడనియు గోపీకృష్ణుడు తగాదాచేసెను!

ఈ వ్యాజ్యము ప్రీవీ కవున్సిలువరకు వెళ్లినది. ప్రీవీ కవున్సిలులో ఈక్రిందితీర్పు చెప్పబడినది:—

జగ్గో అనునామె శివనాథుడను భర్తచేత వర్జింపబడినదైనను ఆమెభర్త జీవించి యుండినప్పటికిని, అన్యశాఖీయురాలైన స్త్రీయైనప్పటికిని, ఆమెకును నిక్కాలాలుకును జరిగిన వివాహము సశాస్త్రీయమై చెల్లదగినదే యగుచున్నది. ఒక్కవర్ణములోనే చేరిన భిన్నశాఖలకు జరిగెడి అంతర్వివాహములు నిషిద్ధము లనుటకు హిందూధర్మశాస్త్రములలో నెక్కడను ఆధార ప్రమాణములు లేవు. అట్టి వివాహము నిషిద్ధమనుటకు వెనుకతీర్పు లేవియును ఆధారముగా లేవు. ద్విజులైన వైశ్యులలోని భిన్నశాఖలయందైనను అట్టివివాహములు జరిగినయెడల చెల్లవనుటకూడ ఆధారప్రమాణములులేవు కనుక, జగ్గోవల్లకలిగిన సంతానమునకు కూడ ఆస్తిలో భాగముకలదు సగభాగమునకు అతడుహక్కుదారుడగును.

చనిపోయిన భర్తయొక్క సోదరుని పునర్వివాహ మాడుట మొదటి విషయము. అందును సపత్నిగా వివాహ మాడబడెను. అతనిచే వదలిపెట్టబడిన దయ్యెను. వదలిపెట్టిన భర్త జీవించియుండగా అన్యశాఖీయుడగు మరొకనిని వివాహమాడెను. ఇటువంటి విచిత్ర దాంపత్య సాహచర్యముకూడ సశాస్త్రీయ మని యీ తీర్పులో సమర్థింపబడెను. దీనికంతకును కులాచారమే ప్రమాణమనిరి. ధర్మశాస్త్రము కూడా తమతీర్పున కనుకూలముగానే యున్నదనిరి.

ఈ కేసునుబట్టి చూడగా సశాస్త్రీయ హిందూ వివాహమనగా నెట్టిది అనే విషయనిర్ణయము చేయుట చాలాక్లిష్టమైన సమస్యగానున్నది కులాచారపద్ధతులనుబట్టి చూచేయెడల అవి పరిపరివిధములుగా కలగాపులగముగా అగమ్యగోచరముగా అమలులో నున్నవి కనుక భిన్నభిన్న అంతశ్శాఖా వివాహములను వర్ణాంతర వివాహములను యివన్నియుకూడ సశాస్త్రీయములైన హిందూవివాహములే యని శాసించుట అగత్యమైయున్నది. ఈవిధంగా వర్ణాంతర వివాహములు సశాస్త్రీయములని శాసింపబడేయెడల తదితరచిల్లర కుశంకలన్నియు అంతర్ధానమగును. దేశములోనున్న వివాహ సంప్రదాయముల కన్నింటికిని వర్తించగల బాహ్యమైన ఏకైకధర్మసూత్రముగా యీ శాసనము వర్తింపగలదు.

### శాసనావశ్యకత కలదా?

... కొందరు హిందూవివాహ విషయము మత సంబంధమైనది గనుక ప్రభుత్వము వారిట్టి మతవిషయములో అధికారము చెలాయించుట తగదని తలంచుచున్నారు.

మనపూర్వ ధర్మశాస్త్రకర్తల యభిప్రాయానుసారము మతవిషయములకును, లౌకిక వ్యవహారధర్మములకును హద్దు మేరలు గీసినట్లుగా లేవు.

నాగరికరాజ్య పరిపాలనముగల ... లో మానవజీవితమునకు సంబంధించిన ... ద్విషయములను గూర్చియు ప్రభుత్వశాసన ... శక్తి యుండకతప్పదు.

### ఆస్తి హక్కులు

ఇది కేవలము మతవిషయమే యనియు, ప్రభుత్వ జోక్యము ఉండకూడదనియు మనము వాదించేయెడల వారసత్వాది తగాదాలు సంభవించినప్పుడును వివాహములు సశాస్త్రీయమైనవా చెల్లదగినవా యను విషయములలోను మనము సర్కారువారికోర్టులకు పోకూడదు. మనకులపెద్దల పంచాయతీలవల్లగాని, మతాధిపతులవల్లగాని, పీఠాధిపతులవల్లగాని వ్యవహార పరిష్కారములను చేసికొనవలెను. కనుక, యీ వర్ణాంతర వివాహశాసనము కూడ ప్రభుత్వము వారిచేతనే నిర్వచింపబడి శాసింపబడుటలో చోద్యములేదు.

౧౦ వ పేజి చూడుడు



Printed and Published by B, Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad. Editor K. Balakrishna Reddy.